బ్ర. విష్ణుభొట్ల ఆంజనేయులు

శ్రీః

# పిండపితృ యజ్ఞ సమీక్షా సమాలోచన

గ్రంథకర్త

మల్లావఝల వెంకట సుబ్బరామశాస్త్రి

(ఆరేపల్లి అగ్రహారం)

కుంచవరపు గ్రామ ప్రచలిత గుంటూరు మండల వేదవిద్వ
త్సభయం దుపన్యసింపబడి తత్సభ్యులచే
ననుమోదింప బడినది.

శ్రీ మత్పరమహంస పరివ్రాజక నారాయణానం
దేంద్ర సరస్వతీ స్వాములవారిచే
ప్రకటింప బడినది.

విరోధి వత్సర ఆషాఢ మాసము.

౧౯౪౯

వసుంధర ప్రెస్, తెనాలి.

శ్రీః

# పండితాశయములు

శ్రీ కుంచవరగ్రామ ప్రచలిత గుంటూరుమండల వేదవిద్వత్సభా సమావిష్టానాం, శ్రౌత స్మార్త కర్మానుష్ఠాయినాం, తద్రహస్యవిదాం, మీమాంసా కుశలానాంచ, విదుషా మాశయః.

అయిభోమహాజనాః! విద్వదగ్రేసరాశ్చ!

పిండపితృయజ్ఞానుష్ఠాన మధికృత్యప్రవృత్తాః, పిండపితృయజ్ఞమీమాంసా, పిండపితృయజ్ఞనిర్ణయ, పిండపితృయజ్ఞసమీక్షాఖ్యాః పత్రికా స్సావధానమస్మాభిః పరిశీలితాః విచారితశ్చ విషయ స్తత్ర సాకల్యేన.

తదయమత్ర నిర్ణయః

సత్యపి పిండపితృయజ్ఞస్య నిత్యత్వే, మతభేదేన కామ్యత్వేవా, అనయోః పిండపితృయజ్ఞ దర్శయాగయోరంగాంగిభావస్య, అధికృతాధికారభావస్యవా అభావాత్, పిండపితృయజ్ఞమననుష్ఠాయకృతస్య దర్శయాగస్య నఫలశూన్యతా॥ఇతి॥

బ్రహ్మశ్రీ 'వేదార్థప్రదీప' రేమిల్ల అన్నావధానులుగారు
,, 'సాంగస్వాధ్యాయభాస్కర' కుప్పా లక్ష్మావధానులుగారు
,, శ్రీపాద లక్ష్మీనృసింహ సోమయాజులుగారు

బ్రహ్మశ్రీ శ్రీపాద వెంకటరమణ దైవజ్ఞ శర్మగారు
,, సన్నిధానం లక్ష్మీనారాయణమూర్త్యవధానులుగారు
,, రేమిల్ల సూర్యప్రకాశశాస్త్రిగారు
,, దెందుకూరి వెంకటప్పయజ్ఞనారాయణ సోమయాజిగారు
,, దెందుకూరి వెంకట సుబ్రహ్మణ్య ఘనపాఠిగారు
,, సూరి రామకోటి శాస్త్రిగారు
,, కుప్పా శివరామ బైరాగి శాస్త్రిగారు
,, కుప్పా వెంకట చలపత్యవధానిగారు
,, గొల్లపూడి మధుసూదనావధానిగారు
,, పిశుపాటి మృత్యుంజయావధానిగారు
,, పాణుకుమాటి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు
,, పాణుకుమాటి లక్ష్మీనరసింహశాస్త్రిగారు
,, మల్లాది చంద్రశేఖర శాస్త్రిగారు
,, కప్పగంతు యజ్ఞవెంకటసుబ్రహ్మణ్య ఘనపాఠిగారు
,, ముళ్ళపూడి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
,, విష్ణుభొట్ల భీమశంకర సోమయాజులుగారు
,, విష్ణుభొట్ల ఆంజనేయ సోమయాజులుగారు
,, నారాయణభొట్ల కృష్ణమూర్తిగారు
,, కుప్పా వెంక టేశ్వరావధానులుగారు

—(ముఖ్యపరీక్షాధికారి)

బ్రహ్మశ్రీ ప్రోద్దున్నపల్లి వెంకటలక్ష్మీపత్యవధానులుగారు
,, అవ్వారి శ్రీరామసోమయాజులుగారు
,, లంకా పేరావధానులుగారు
,, విష్ణుభట్ల సత్యనారాయణమూర్త్యవధానులుగారు

# నివేదనమ్.

శ్రీమత్పరమహంస పరివ్రాజక నారాయణానంతేంద్ర సరస్వతీస్వామినః పూర్వస్మిన్నాశ్రమే – కూచిభొట్లవంశీయానాం, రామయ్యశర్మణాం జ్యేష్ఠపుత్రాః – వేంకటసుబ్బయనామానః – పూర్వజన్మభాగ్యవశాత్ లబ్ధవైరాగ్యసంపదః సాంప్రదాయం కృతభాష్యశాంతయః – అద్య 'వెదుళ్ళపల్లి' గ్రామె, వేదాన్తప్రవచనం కుర్వంతః – ధర్మప్రచారాయ అస్మాకమేక త్పుస్తకముద్రణార్థం మహాత్సాహాయ్యమకార్షు రితి ధార్మికాణాం ధురి నివేదయితుం మోముద్యామహే వయమ్.

—గ్రంథకర్త

—()—

ఓం

శ్రీః



# పిండ పితృ యజ్ఞ సమీక్షా సమాలోచన

వైదికాగ్రేసరులారా! విద్వద్వరేణ్యులారా!

ఇటీవల నాచే రచియింపబడిన "పిండపితృయజ్ఞనిర్ణయ" మనుఁ బత్రికను అద్దానిని వక్రమార్గమున సమీక్షించి వ్రాసిన నా ప్రతికక్షుల "పిండపితృయజ్ఞ సమీక్ష" యను పత్రికను పండితులు నిర్వక్ర స్వభావముతోఁ బరిశీలించి యందలి గుణదోషములను గ్రహింపఁగోరెద.

ఇటీవల నేను పిండపితృ యజ్ఞనిర్ణయమనుఁ బత్రిక నొకదానిని గీర్వాణభాషలో వ్రాసియుంటిని. అందలి విషయమును సంగ్రహముగా సీక్రిందఁ బొందు పఱచుచున్నాను.

పిండపితృ యజ్ఞమునునొక హవిర్యాగమవశ్యానుష్ఠేయముగ శ్రుతిచే విధింపబడెనని తొలుత నే నంగీకరించి యద్దానిని శిష్టులు గొందరాచరించుట లేదనియు నందుచే వారలాచరించు దర్శయాగములు వ్యర్థములనియు నొక ప్రతీతి బయలుదేరుటచే నిందును గుఱించి విచారింపవలసివచ్చినదని మొదలిడి పిండపితృయజ్ఞమునకును దర్శయాగమునకును, అంగాంగి భావసంబంధముగాని యధికృతాధికార భావసంబంధముగాని లేదని సప్రమాణముగ నిరూపించి నిత్యకర్మ

యను బుద్ధితో నద్దాని నాచరించుట యావశ్యకమనియు నెవరైన నట్లాచరింపనిచో నిత్యకర్మాకరణ ప్రయుక్త దోషమేగాని వారాచరించిన దర్శయాగమునకు వైయర్థ్య మెంతమాత్రము లేదనియు నిరూపించి యుంటిని. కావున నాపత్రికకు ముఖ్యాశయము పిండపితృ యజ్ఞము నాచరింపనివార లాచరించిన దర్శయాగమునకు ప్రతికక్షులాపాదించిన వైగుణ్య దోషమును పరిహరించుటయె గాని పిండపితృ యజ్ఞానాచరణమును సాధించుట యెంతమాత్రము గాదు. నా ప్రతికక్షుల తొలిపత్రికయును, ఉపసంహార భాగమును బరిశీలించిచూడఁ బితృయాగము నాచరింపనివారల దర్శయాగమునకు వైయర్థ్యమును సాధించు నుద్దేశ్యముతో బయలువెడలినట్లు స్పష్టమగుచున్నది కాని పిండపితృయాగము నాచరింపుమని యుపదేశించుట కెంతమాత్రము గాదు. తథ్యమిట్లుండ నేను "పిండపితృయజ్ఞనిర్ణయ" మను పత్రికయందు, అంగాంగిభావ, అధికృతాధికారభావ, నిత్యత్వములను మూడుపక్షములచేతను సర్వథా పిండపితృయాగ మాచరింప బనిలేదని వ్రాసినట్లు సూచించుచు శ్రీ మోరుగంటి నీలకంఠశాస్త్రిగారు తమ సమీక్షయను బత్రికయందలి మూడవపేజీలో "ఇట్టియాకాంక్షలుగలుగ దాము పై మూడుపక్షములచేగూడ బిండపితృయజ్ఞము నాచరించుటకు గారణ మగపడదు. గావున సర్వవిధముల బిండపితృయజ్ఞమును మానినట్టి తమవారల దర్శయాగము ఫలప్రదమే యను నిర్ణయమును వ్రాసియుండెను" అని వ్రాసుచ్చియు౦

షిరి. కావున సమీక్షకులయొక్క ఋజుబుద్ధిని బరీక్షకులగు విద్వాంసులు నిష్పక్షపాతబుద్ధితో సమీక్షింతురని నమ్ము చున్నాను.

పిండపితృయజ్ఞ మీమాంసా విషయసంగ్రహము

మొదట (శ్రీ) చివుకుల వేంకటరమణ సిద్ధాంతిగారు "పిండపితృయజ్ఞమీమాంస" యనునొక పత్రికను సంస్కృతమున వ్రాసియుండిరి. అందు పిండపితృయజ్ఞ మను నొక హావిర్యాగమవశ్యానుష్ఠేయముగ శ్రుతిచే విధింపబడెననియు; నయ్యది కొందరి శిష్టులచే కలికాలమాహాత్మ్యమువలన నాచరింపబడుటలే దనియు, నందువలన నీ మీమాంస ప్రవృత్త మయినదనియు, తద్విధాయక వాక్యము ననుసరించి యాపాతతఃదర్శయాగమునకును బిండపితృయాగమునకును నంగాంగిభావము దోచుచున్నను శ్రుతి లింగ వాక్య ప్రకరణస్థాన సమాఖ్యలను నంగాంగిభావబోధక ప్రమాణము లారింటి వలనను, దర్శపితృయాగములకు నంగాంగిభావము సిద్ధింప నేర దనియు, ఈ పిండపితృయజ్ఞ మనాహితాగ్నికిగూడ నాచరణీయమని యాపస్తంబు డుపదేశించెననియు, దర్శయాగము సమంత్రకముగ రెండుగోజులనుష్ఠింప దగినదనియు, అట్టితటి పూర్వదినాపరాహ్ణమున బిండపితృయాగ మాచరించినచో విరోధమేమియు లేదనియు, శ్రుతిసిద్ధమయిన యీ పిండపితృయాగమునకు దర్శయాగమునకును నధికృతాధికారభావముగూడ శ్రుతిసిద్ధమే యనియు, కల్పసూత్రకారులందఱు నీసిద్ధాంతము

నంగీకరించిరనియు గావున పిండపితృయాగమనుష్ఠింపక దర్శ యాగమనుష్ఠించినచో నయ్యది భస్మాధికరణక హోమము వలె వ్యర్థమనియును నిరూపింపబడినది.

పిండపితృయజ్ఞ నిర్ణయ విషయ సంగ్రహము

ఇందుకు సమాధానముగ నేను పిండపితృయజ్ఞనిర్ణయ మను నొక పత్రికను సంస్కృతమున వ్రాసియుంటిని. ఇందు "పిండపితృయజ్ఞమను హవిర్యాగము శ్రుతి విహితమనియు, పితృయాగమునకును దర్శయాగమునకును నంగాంగిభావము లేదనియు, దర్శయాగము సమంత్రకముగ దివసద్వయసాధ్య మనియు, పిండపితృయజ్ఞమన్వాధానదినమునగాని, యాగదిన మునగాని యనుష్ఠేయముగ కాలవశమున సంప్రాప్తమగునని యు, గాని దర్శపితృయాగముల కధికృతాధికారభావ మున్న దని చెప్పుటగాని యందువలన పితృయాగమును చేయనివా రల దర్శయాగము నిష్ఫలమగుటగాని పొసగదనియు, శ్రుతి పిండపితృయజ్ఞమునుమాత్రమే విధించుచున్నదిగాని దర్శపితృ యాగముల కధికృతాధికారభావమును విధించుటలే దనియు, మఱియు నీపితృయాగము ఒకతూరి దర్శయాగము మధ్యను మఱియొకతూరి దర్శయాగాంతమునందును అనుష్ఠింప వలసి వచ్చును. గాని, దర్శయాగారంభమునకు బూర్వమెన్నడును అనుష్ఠింపవలసి రాదనియు, అందువలన నయ్యది యధికార సమర్పకము గానేరదనియు, దర్శయాగాంతమున జేయు నీ పితృయాగమెంత మాత్రము దర్శయాగమున కధికార సమ

5. పిండపితృయాగము జేయకపోయినను దోషము లేదంటిననియు. 17 వ పేజీ.

6. శిష్టాచారమునను సరించి పితృయజ్ఞ మాచరింప బనిలేదని వాచ్యముగా దెల్పుచుంటిననియు. 18 వ పేజీ.

7. మానంశమునందలి శిష్టాచారమిట్లేయని ప్రకటించుచుంటిననియు. 18 వ పేజీ.

8. పిండపితృయజ్ఞానాచరణ మును సమర్థింపఁ బూనితిననియు; 18 వ పేజీ.

9. ఇట్టి నిత్యకర్మను నేనాచరింపక యితరులకుఁగూడ నాచరింప బనిలేదని నిగూఢముగ బోధించుచుంటిననియు. 26 వ పేజీ.

10. ఫలప్రాపకములగు నీపితృయజ్ఞాదుల నాచరింపఁ బనిలేదని బోధించుచుంటి ననియును. 27 వ పేజీ.

ఆయా పేజీలయందు దహరించియుండిరి.

ఈయవి నాపత్రికను సరిగా నర్థముజేసి గొనకనో, విషయపరిజ్ఞానము లేకనో, వక్రమార్గమున సమీక్షించి లోకమునకు నపార్థమును గలుగజేయుచుఁ దమవాదమును బలపఱచు కొనుటలఁపుననో చేసిన యసత్యారోపణలుగాని సత్యసమ్మతము లెంతమాత్రముగావు.

ఇందుకు సమాధానము

1. నేను నాపత్రికయందలి రెండవ పేరాలో "బహవః కాలాదారభ్య శ్రుతివిహిత కర్మానుష్ఠాతృభిరస్మదీయై రనూచానై శ్శిష్టైరయం నానుష్ఠీయత ఇతి వినాచ తదనుష్ఠానమ్. దర్శయాగానుష్ఠానస్య వైయర్థ్య మవ్యాహతమితి చప్రథాయాః ప్రవృత్తత్వాదస్త్యవసరోఽస్య విచారస్య" అని వ్రాసియుంటిని. ఇందు శ్రుతివిహిత కర్మానుష్ఠాతలగు మనపెద్దలు పిండపితృయజ్ఞ మాచరించుట లేదను ప్రథయు, నందువలన వారలనుష్ఠించిన దర్శయాగములు వ్యర్థములను ప్రథయును, నాపత్రికకుఁ దొలిపత్రికవలనఁ బ్రసృత్తమయినట్లు స్పష్టముగ నర్థమగుచుండగా నాపెద్దల వంశాచారమును నేనిచట నిర్ణయించియుంటినని వ్రాసిన సమీక్షకుల యొక్క సంస్కృత భాషాపాండిత్యమును పరీక్షకులగు విద్వాంసులు గ్రహింతురుగాక.

2. మఱియు నా పత్రికలోని 18 వ పేరాలో "అతః అస్యాః శ్రుతేరాభ్యుదయిక కర్మాధికృతైరపి మానవైః పితృతిథావ మాయాం ప్రాగ్వాపశ్చాద్వా యథా సంభవం స్వకాలే పితరః యజనీయాః ఇత్యాశయేన పిండపితృయజ్ఞస్య నిత్యతా ప్రతిపాదనఏవ తాత్పర్య మవగచ్ఛామః", అనియు, 19 వ పేరాలో "అతోఽయమమావాస్యా యామపరాహ్ణకాలీనః పిండపితృ యజ్ఞః నిత్యః స్వతంత్ర ఏవ నాపిదర్శాంగం. నవా దర్శయాగే అధికారసమర్పకయు" అనియును వ్రాసి పితృ

ర్పకము గానేరదనియు, నందువలన దర్శ పిత్రృయాగము లనధికృతాధికారభావము సంభవింపదనియు, పిత్రృయాగము నిత్యకర్మయను భావముతోననుష్ఠింపఁ దగినదనియు, నట్టి పిండపితృయజ్ఞము నాచరింపనిచో నిత్యాకర్మా కరణ ప్రయుక్త దోషమేగాని, దర్శయాగములకు వైగుణ్యము సంభవింపదనియు, మీమాంసకు లీ పిండపితృయజ్ఞమును కామ్యకర్మమునుగ నొప్పిరిగాని నిత్యకర్మనుగ నొప్పి యుండలేదనియు, గావునఁ బిత్రృయాగానాచరణము వలన దర్శయాగాచరణ మెంతమాత్రము వ్యర్థముకానేరదనియును నిరూపింపబడినది.

పిండ పితృ యజ్ఞ సమీక్షా విషయ సంగ్రహము

ఇందుపై ప్రకృతము శ్రీయోరుగంటి నీలకంఠశాస్త్రి గారిచే "బిండపితృయజ్ఞ సమీక్ష" యను పేరుతో నొక పత్రిక ప్రచురింప బడినది.

వీరు పై రెండు పత్రికలలోని గుణదోషములను బరి శీలించుటకుఁ గడంగిన పెద్దమనుష్యులమని తమ పత్రికయం దచ్చటచ్చట వ్రాయ మొదలిడిరిగాని వీరును నా నాటకాంతర్గత పాత్ర లేయనుట లోకమునకు విదితమేయగు చున్నది.

వీరు పరిశీలించి వ్రాసిన సమాధానమునఁబసయెంతగ నున్నను నా పత్రిక యందు నేను వ్రాయని విషయములనేక ములను నేను వ్రాసినట్లుద్ఘాటించి వ్రాసి యథా యత

థ్యదోషోద్ఘాటనచేఁ దమ గ్రంథమును విపులపఱచి, పై రెండు పత్రికలకంటెఁగూడ నియ్యది విషయపూరితమను భావమును దమవారికి నుత్పాదించుచు ఉదాసీనమగు శిష్టలోకమును మోసపుచ్చిరి. ముఖ్యముగ వీరి పత్రికకు ప్రధానోద్దేశ్యము. లోకమునకు నావాదమునందు వ్యతిరేక భావమును బురి గొల్పుటయేగాని విషయమునకుఁ దగు సమాధానము నిచ్చుట యెంతమాత్రముగాదని సమీక్షాపత్రికను పరీక్షించి చూచిన పండితులకుఁ బ్రత్యక్షముకాఁగలదు.

దీనికి దగు నాధారములఁ గొన్నింటి నీక్రింద నుదాహరణముగఁ జూపుచున్నాను.

శ్రీ ఓ. సీ. కం. శాస్త్రిగారు తమ పిండపితృ యజ్ఞ సమీక్షయం దుదహరించిన యసత్యారోపణలు.

1. చాలకాలము నుంచి మా పెద్దలు పిండపితృయజ్ఞ మును జేయుటలేదని నేను నిర్ణయించితిననియు. 2వ పేజీ.

2. మూడు పక్షములచేఁ గూడ పితృయజ్ఞము నాచ రించుటకుఁ గారణము లేదంటిననియు. 3 వ పేజీ.

3. పితృయజ్ఞమును విధించు శ్రుతి నించుకేనియు నుదహరించ లేదనియు. 3 వ పేజీ.

4. ఆహితాగ్నికిఁ బిండపితృ యజ్ఞ మెంతమాత్రము జేయనవసరము లేదంటిననియు. 14 వ పేజీ.

యాగమునకు నిశ్శ్రేయస్కత్వమును బ్రతిపాదించియుంటిని. ఈవిషయమును శ్రీ. ఓ.నీ.కం. శాస్త్రిగారు, తమ పత్రికయందు 19 వ పేజీలో నంగీకరించికూడనుండిరి. అయినను వీరు దమ పత్రికయందచ్చటచ్చట పైనుదహరించిన 2, 4, 5, 6, 8, 9, 10, దోషముల నారోపించి వ్రాయుట యెంత సాహసకృత్యమో పండితులకే విశదముకాగలదు. పోనిండు 'కిమకార్యం కదర్యాణామ్' అనిగదా పెద్దలందురు.

3. మఱియు నేను నాపత్రికయందలి 16 వ పేరాలో 'వస్తుతస్తు ఆఖ్యాయికారూపాయామస్యాం శ్రుతౌ పరిదృశ్యమానవాక్యే "కదంబే' తస్మాత్పితృభ్యః పూర్వేద్యుః క్రియతే" ఇత్యేతస్మిన్ వాక్యఏవ పిండపితృయజ్ఞ విధిత్వకల్పనం యుక్తం — తస్మాత్పితృభ్యః పూర్వేద్యుః కుర్యాత్ ఇతి" ఇత్యాది వాక్యములచేఁ బిండపితృయజ్ఞ విధాయకమగు 'ఇంద్రోవృత్రగ్ంహత్వా। అసురాన్ పరాభావ్య' అను శ్రుతి నుదహరించియున్నాను. ఆపేరాలో నీశ్రుతికనువాదకముగ ద్వితీయాష్టకమునందలి "ఇంద్రోవృత్రగ్ంహత్వా పరాంపరావతమగచ్ఛదపారాధమితిమన్యమానః" అను మఱియొక శ్రుతిని గూడ నుదహరించియుండగా శ్రీ ఓ. నీ. కం. శాస్త్రిగారు దమ పిండపితృయజ్ఞసమీక్ష యను పత్రికయందలి 3 వ పేజీలో నేను పితృయజ్ఞమునువిధించు శ్రుతి నించుకేనియు నుదహరించియుండలే దని యారోపించి వ్రాయుటకు నాధారమేమియో స్పష్టమగుటలేదు. కావున వీరు శిష్టనింద్యార్థమై

ప్రియత్నించినంతగ నా పత్రిక నర్థముజేసికొనుటకుఁ బ్రయత్నింపలేదని తేటతెల్లమగుచున్నది. ఇట్టివీరు వెనుకటి రెండు పత్రికలలోని గుణదోషములను నిష్పక్షపాతబుద్ధితో సమీక్షింపదలచిన సమీక్షకులమని వ్రాసికొనుట యెంత సాహసమో చూడుడు.

మఱియు శ్రీ ఓ. సీ. కం. శాస్త్రిగారు నా పత్రిక నర్థముజేసికొనుటలోఁ బొరబాటుబడుటయటుండఁ బైపెచ్చు మా సంశీయులు నిత్యకర్మత్యాగులని పలుమారు నిందించుచు, నహీనిందాన్యాయముచే దమ్ము దమసంశీయులను నిఖల నిత్య కర్మానుష్ఠాతలని పొగడుకొనుట ప్రారంభించిరి. ఇయ్యది యెంత సమంజసమో చూడుడు. పుట్టినప్పటినుండియు సర్వసంగ పరిత్యాగమునుజేసి యొడ్డున గూర్చొనిన మహానీయులు, కర్మభారమును వహించిన గృహస్థులను కర్మత్యాగులని నిందించుట చెల్లునేమోగాని, నిఖిలనిత్యకర్మానుష్ఠానబాధ్యతగల గృహస్థులయిన వీరలు దమ కర్మానుష్ఠానమును వెల్లడించుకొనుట యెంత హాస్యాస్పదము. నిజముగ విచారించినచో మనము ప్రత్యహమనుష్ఠింపదగిన సంధ్యావందనాది నిత్యకర్మములను సక్రమముగ ననుష్ఠింపుచుంటిమని యనదగునా ? అట్టి కర్మాచరణమునగూడ శ్రీ శాస్త్రిగారి తల నెన్నిసారు లక్షతలు పడియుండునో వారి హృదయమునకైనను తెలియదా ? వృత్తులనుబట్టి మన కర్మానుష్ఠానమింతగ సంకుచితమైనదనుటలో నతిశయోక్తి కలదా ?

ఇఁక మిగిలినకర్మలను మనమాచరించుట లేదనుటకు సందియ ముండునా ? అయినను (శ్రీ) నీ. కం. శాస్త్రిగా రింత సాహస ముగ వ్రాయుటకుఁ గైతకు యతి బలమనునట్లు వీరి కేదియో నియతిబలముండితీర వలయును. లేనిచో మానవమాత్రు లింత సాహసముగ వ్రాయజాలరు.

మఱియు (శ్రీ) నీ. కం. శాస్త్రిగారి పత్రికయం దచ్చ టచ్చట పూర్వాపరవిరోధము, పరనింద, ఆత్మస్తుతియు నెక్కు వగ గన్పట్టుచున్నను దిఙ్మాత్రముగ నవ్వానిని ప్రదర్శించి గ్రంథవిస్తరభీతిచే నీ ప్రకరణమును ముగించుచుఁ బ్రకృతము ననుసరించుచున్నాను.

ప్రకృత విషయము

(శ్రీ) ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారు దర్శయాగ ఫల ప్రాప్తికిఁ బిండపితృ యజ్ఞాచరణ మావశ్యకమను విషయము శ్రుతి స్మృతి ప్రమాణసిద్ధమని ప్రతిజ్ఞచేసి యేతద్విషయము తైత్తిరీయశ్రుతి, ఆపస్తంబ కల్పసూత్రములను రెండుప్రమా ణములచేతనేఁ బ్రదర్శింపబడుచున్నదని ముగించిరి. వీరి పూర్వపు పత్రికా రచయితలు ((శ్రీ) చి. వేం. సి. గారు) కల్పసూత్రకారులందఱినిఁ బ్రమాణముగ గైకొనియుండిరి. ఇపుడు (శ్రీ) ఓ. నీ. కం. శాస్త్రిగా రాపస్తంబులకు నితర సూత్రకారులతో బ్రయోజనమిసుమంతయు లేదనుచు ఆప స్తంబ సూత్ర మొక్కటియె ప్రమాణమని వక్కాణించిరి. పోనిండు. ఏది యెటులున్నను దర్శయాగఫలప్రాప్తికిఁ బితృ

యాగాచరణ మావశ్యకమని వారు ప్రమాణముగ జూపిన తైత్తిరీయ శ్రుత్యాపస్తంబసూత్రముల నొకింత విచారింతము.

శ్రీ ఓ. నీ. కం. శాస్త్రి, శ్రీ చిం. వెం. ర. సిద్ధాంతి గార్ల సిద్ధాంత పరిష్కారము పిండపితృయజ్ఞ మవశ్య మాచరింపవలె ననియు, నయ్యది యాచరింపనిదే దర్శయాగ మాచరింప వీలులే దనియు నీ రెండు విషయములు బహిష్కృతములు. గాన నీ రెండు విషయములను విధించు నట్టి శ్రుతియావశ్యకము - అయ్యది తైత్తరీయ బ్రాహ్మణము నందలి మొదటి కాండమున ద్వితీయ ప్రపాఠకము యొక్క- పదియవ యనువాక మన బరగు "ఇంద్రో వృత్రగ్ం హత్వా అసురాన్ పరాభావ్య సోమామావాస్యాం ప్రత్యాగచ్ఛత్। తే పితరః పూర్వేద్యు రాగచ్ఛన్। పితౄన్ యజ్ఞోగచ్ఛత్। తం దేవాః పునరయాచంత। తమేభ్యోన పునరదదుః। తే ఽబ్రువన్ వరం వృణామహై। అథవః పునర్దాన్ స్యామః। అస్మభ్యమేవ పూర్వేద్యుః క్రియాతా ఇతి। తమేభ్యః పునరదదుః। తస్మాత్పితృభ్యః పూర్వేద్యుః క్రియతే। యత్పితృభ్యః పూర్వేద్యుః కరోతి। పితృభ్య ఏవ తద్యజ్ఞంని ష్క్రీయ యజమానః ప్రతనుతే॥ అనునది యన్నివారి యాశయము. ఇందు పిండపితృయజ్ఞము విధింపబడుచున్నదను విషయము భయసమ్మతము గావున నయ్యది నిర్వివాదాంశము. ఇక పిండపితృ యజ్ఞ మాచరింపనిదే దర్శ యాగమాచరింప వీలులేదను నాశయముతో బితృ

దర్శ యాగము లకధి కృతాధికార భావమునుగూడ నీశ్రుతి విధించు చున్నదని పైవారి సిద్ధాంతము కావున నయ్యది వివాదగ్రస్తము.

శ్రీ. ఓ. సీ. కం. శాస్త్రీగారు తమపత్రికయందు పైన నుదహరింప బడిన శ్రుతివిధాయక వాక్యము ఇతికర్తవ్యతా బోధక వాక్యములను రెండుభాగములతో నెప్పుచున్నదనియు నందు ఇంద్రోవృత్రగ్ం హత్వా. అను వాక్యము మొదలు "తస్మాత్పితృభ్యః పూర్వేద్యుః క్రియతే"అను వాక్యము వఱకుc బిండపితృయజ్ఞ విధాయక ప్రకరణమనియు. "యత్పితృభ్యః పూర్వేద్యుః కరోతి" అను వాక్యముమొదలను వాకాంతమువఱకు, నితికర్తవ్యతా బోధకప్రకరణ మనియును వ్రాకుచ్చి యుండిరి. అందు మొదటి విషయమంగీకృతమే. ఇతికర్తవ్యతా విధాయక ప్రకరణమను రెండవ విషయమంగీకరింప దగదు. ఏలయనకర్మబోధకమగు వాక్యమువలన కథంభావాకాంక్షయనునొక యాకాంక్ష గలుగగా తచ్ఛామకముగ నితి కర్తవ్యతా బోధక వాక్యములు బ్రవర్తిoపుచున్నవి. కావున కర్మలయొక్క యనుష్ఠానాంశమును బోధించు వాక్యము లితి కర్తవ్యతా బోధక వాక్యములని యర్థము. ఇంతియే గాని ప్రత్యేకములయిన రెండు కర్మలయొక్క పౌర్వాపర్యమును బోధించు వాక్య మితి కర్తవ్యతా బోధకము గానేరదు. ఏల యన, "దర్శ పూర్ణ మాసాభ్యా మిష్ట్వా సోమే నయజేత" అను

వాక్యము దర్శపూర్ణమాసలకు సోమయాగపూర్వకాలీనత్వ మును బోధించునంతమాత్రమున నయ్యది సోమయాగీయ కథంభావాకాంక్షాశామకముగాని, దర్శపూర్ణమాసీయకథం భావాకాంక్షాశామకముగానియగునితికర్తవ్యతాబోధక వాక్య ముగానేరదు గదా? అట్లే "పితృభ్య ఏవ తద్యజ్ఞం నిష్క్రీయ యజమానః ప్రతనుతే" యను వాక్యముగూడ పితృయాగ మునకు దర్శయాగ పూర్వకాలీనత్వమును బోధించినంత మాత్రమున నియ్యది దర్శపూర్ణమాసయాగీయకథంభావా కాంక్షానివర్తకమగు నితికర్తవ్యతను బోధించునదిగాని, పితృ యాగీయకథంభావాకాంక్షానివర్తకమగునితికర్తవ్యతనుబోధిం చునది గాని కానేరదు. శ్రీ శాస్త్రిగారు దర్శపితృ యాగ ముల కంగాంగిభావము లేదని యంగీకరించి స్వతంత్రములగు నీ కర్మల రెంటికిని పౌర్వాపర్యమును బోధించు నీ వాక్య మితికర్తవ్యతాబోధకమని యనుట యెంత సమంజసమో చూడుడు. తుష్యతున్యాయముచే నొకవేళ శ్రీ శాస్త్రిగారు చూపిన "పితృభ్యఏవతద్యజ్ఞం నిష్క్రీయ యజమానః ప్రత నుతే" అనువాక్య మితికర్తవ్యతావిధాయకమని యంగీకరిం చుదమన్నను బొసగనేరదు. ఇందుకుఁ దగు కారణముల నీ క్రింద నుదహరించుచుంటినిగావున దోషజ్ఞులిందలి గుణదోష ములను గ్రహింతురు గాక!

తైత్తిరీయ బ్రాహ్మణమునందలి మొదటి కాండమున దృతీయ ప్రపాఠకము యొక్క పదియవ యనువాకమగు

"ఇంద్రో వృత్రిగ్ంహత్వా । అసురాణ్ పరాభావ్య" యను నది పిండపితృయజ్ఞమును విధించుచున్నది. ఈ యనువాకము నందలి "ఇంద్రో వృత్రిగ్ంహత్వా । అసురాణ్ పరాభావ్య । సోమావాస్యాం ప్రత్యాగచ్ఛత్ । తే పితరః పూర్వేద్యురాగచ్ఛన్ । పితౄన్ యజ్ఞోగచ్ఛత్ । తం దేవాః పునరయాచంత । తమేభ్యోనపునరదదుః । తేబ్రువన్ వరం వృణామహై । అథవః పునర్దాస్యామః । అస్మభ్యమేవపూర్వేద్యుః క్రియతా ఇతి । తమేభ్యః పునరదదుః" అను నీ పదునొకండు వాక్యములు కథాబోధకములు. "తస్మాత్పితృభ్యః పూర్వేద్యుః క్రియతే" అను బదిరెండవవాక్యము పిండపితృయజ్ఞమును విధించుచున్నది కనుకనే శ్రీవిద్యారణ్యమునీంద్రులీ వాక్యమునందలి 'క్రియతే' యను పదము లేట్ లకారమని నిర్ణయించి 'తస్మాత్పితృర్థం కర్మ పూర్వేద్యుఃకుర్యాత్' అని విధ్యర్థకముగ భాష్యమును రచియించిరి. పిదప "యత్పితృభ్యః పూర్వేద్యుః కరోతి" – "పితృభ్య ఏవ తద్యజ్ఞం నిష్క్రీయ యజమానః ప్రతనుతే" అను పై యనువాకమునందలి 13, 14 వాక్యములకు "తథాకృతే తే నమావాస్యేన యజ్ఞం పితృభ్యో నిష్క్రీయ యజమానః తం అనుష్ఠాతుం ప్రవర్తతే" యని భాష్యమును రచియించిరి. దీనియర్థము: అమావాస్య రోజున పిండపితృయజ్ఞమును జేయగా, అట్టి యమావాస్యచే దర్శయాగమును బితృదేవతలనుండి కొనుగొని యజమానుడు దర్శయాగము ననుష్ఠింప బ్రవర్తించుచున్నాడు; అని.

కావున పై యనువాకమునకు శ్రీ విద్యారణ్యమునీంద్రులు రచియించిన భాష్యపఙ్క్తి యిట్లుండ శ్రీ సీ. కం. శాస్త్రిగారు వారి పిండపితృయజ్ఞసమీక్ష యను పత్రిక యందు పై నుదహరించిన యనువాకము— విధాయక వాక్యము, ఇతికర్తవ్యతాబోధక వాక్యము లను రెండు భాగములతో నొప్పుచున్నదను నాశయమును మది నిడుకొని పై యనువాకమునందలి "యత్పితృభ్యః పూర్వేద్యుః కరోతి" పితృభ్య ఏవ తద్యజ్ఞం నిష్క్రీయ యజమానః ప్రతనుతే" అను 13–14 వాక్యములకు, తథాకృతే=అట్లుచేయబడగా అట్టిమూల్యముచే; దర్శపూర్ణమాసయాగమును పితృభ్యః= పితృదేవతలవలన; నిష్క్రీయ=మూల్యముచే గొనుగొని, యజమానుడు దానిని చేయుటకు ప్రతనుతే=ప్రవర్తింప వలయును=అని యర్థమును వ్రాసి ఇట ప్రతనుతే యనునది లేట్టని లట్టుగాదని నిర్ణయించిరి. ఇట్టి వీరినిర్ణయమునకు సహజసాహస జన్యమగు శాస్త్రప్రవృత్తియే యాధారముగాని వేరొండు నాధారముకనుపింపదు.

శ్రీ. ఓ. సీ. కం శాస్త్రిగారు పై యనువాకము నందలి "తస్మాత్ త్పితృభ్యః పూర్వేద్యుః క్రియతే" అను పితృయజ్ఞ విధాయక వాక్యమునకు అర్థనిర్వచనము జేయుటలో శ్రీ విద్యారణ్య మునీంద్రుల భాష్యమును నాధార పఱచుకొని వారిపత్రిక యందలి 7 వ పేజీలో కావుననీ=క్రియతే = యనునది విధ్యర్థకమగు లేట్టను

విషయము సువ్యక్తముగాఁగ శ్రీ విద్యారణ్యులు దీనియర్థమును "తస్మాత్పిత్రర్థం కర్మపూర్వేద్యుః కుర్యాత్" అని విధిని లిఙ్ప్రయోగముతో నిరూపించి యున్నారు. అనిస్పష్టముగ వ్రాసియుండిరి.

ఇట్టి వీరు పై యనువాకమునందలి 14 వది యగు "పితృభ్యఏవతద్యజ్ఞం నిష్క్రీయ యజమానః ప్రతనుతే" యను వాక్యమున కర్థనిర్వచనముఁ జేయుటలో = ప్రతనుతే = అనునది లడర్థకముగ శ్రీ విద్యారణ్యులు తమ భాష్యమున నిర్వచించియుండగా శ్రీ. సీ. కం. శాస్త్రిగారిచ్చోట శ్రీ విద్యారణ్యులనుఁగూడ దృణీకరించి వారపర విద్యారణ్యుల మను తలంపుతో 'ప్రతనుతే' అనునది లేట్టగాని లట్టుగాదని స్వాంతంత్రించి స్పష్టముగ వ్రాసిరి. ఇందువలన వీరి కెంతటి వారైనను సర్వదా ప్రమాణభూతులుగారని స్పష్టమగుచున్నది.

కావున శ్రీ విద్యారణ్యులంతటివారిని ఒకేయనువాకమునందలి యొక వాక్యమున బ్రమాణముగ నంగీకరించి మరియొక వాక్యమున నప్రమాణభూతులుగ నొనరించిన శ్రీ. సీ. కం. శాస్త్రిగారు అర్ధజరతీయతాదోషమేదియని శంకింపఁబనిలేదు. తమకేనని తామే లోకమునకు వ్యక్తపఱచిరి.

ఎవ్వరేని శ్రుతివిహితమగు పిండపితృయజ్ఞము నాచరింపవలదని యర్థనిర్వచనము జేసినచో నద్దియది శ్రుతికి మహాపరాధమే. అట్టి మహాపరాధ మెవ్వరు

బ్రాహ్మణు డుండడని శ్రుత్యాశయమగుటయు దధ్యమేగాని శ్రుతివిహితములగు స్వతంత్రకర్మలకు శ్రుత్యాశయమునకు వ్యతిరేకముగ సంబంధములఁ గల్పించి యట్టి సంబంధములచే విహితకర్మానుష్ఠానముల వ్యర్థపుచ్చుటగూడ శ్రుతికి మహాపరాధమే యనియు అట్టి మహాపరాధ మొనర్చు బ్రాహ్మణ బ్రువులు గొందఱుందురనియు శ్రుతిదేవత యెఱింగియే వారట్టి మహాపరాధ మొనర్చుటకు ప్రతిబంధకముగఁ గొన్ని వాక్యములను వారికిఁ గంఠపాశ మొనరించినది.

కావున బ్రకృతాను వాకమునందలి॥ "పితృభ్య ఏవ తద్యజ్ఞం నిష్క్రియ యజమానః ప్రతనుతే" యనువాక్యము దర్శయాగమునందధికార నిష్క్రయణమును బోధించు చున్నదని శ్రీ. ఓ. నీ. కం. శాస్త్రిగారి సిద్ధాంత ప్రకార మంగీకరించుదమన్నను తదను వాకమునందలి "యత్పితృభ్యః పూర్వేద్యుః కరోతి" యను 13 వ వాక్యము వారికి గంఠ పాశమగుచున్నది. ఏలయన ఆవాక్యమునకు భాష్యకారులగు శ్రీ విద్యారణ్యులు "తథాకృతే" "తేనమూల్యేన" (అట్లు చేయబడగా నట్టిమూల్యముచే) అని భాష్యమునురచియిం చిరి అయ్యర్థమును శ్రీ శాస్త్రిగారు వారిపత్రికయందలి 8వ పేజీలో నంగీకరించి గూడనుండిరి. ఇట్టితఱి. "పితృభ్య ఏవతద్యజ్ఞం నిష్క్రీయ యజమానః ప్రతనుతే" యనుపై వాక్యము "యత్పితృభ్యః పూర్వేద్యుః కరోతి" యను పూర్వ వాక్యములో నేకవాక్యతనుజెంది పూర్వదినమున

పితృయాగమొనర్చి మఱుదినము నొనర్చు దర్శయాగము పూర్వదినానుష్ఠిత పితృయాగముచే విక్రీతమగు నను భూతార్థమును బోధించుచున్నది గావుననిట్టి వాక్యమెన్నడును నధికార నిర్ణయణమును విధించునట్టి విధాయక వాక్యము గానేరదు.

శ్రుతి పితృయాగమునను ష్ఠించియే దర్శయాగము ననుష్ఠింపవలయునని విధించుటకుఁ బూర్వదినసిద్ధమగుఁ బితృ యాగానుష్ఠానమునపేక్షింపదు. ఇచట "యత్పితృభ్యః పూర్వేద్యుః కరోతి" యను వాక్యము "తస్మాత్పితృభ్యః పూర్వేద్యుః క్రియతే" యను వాక్యముతో సాపేక్షమై (అట్లుపితృ దేవతలకొఱకు పూర్వదినమున బితృయాగము జేయబడగా) అని యర్థమును బోధించుచున్నది. ఇట్టి వాక్యానంతర ప్రవృత్తమయిన "పితృభ్యఏవ......ప్రతనుతే" యను వాక్యము విధాయక వాక్యమెన్నడును గానేరదు. కనుకనే భాట్టదీపిక యందలినాల్గవ యధ్యాయమున దర్శపితృయాగ ముల కంగాంగిభావ నిరాకరణ ప్రసంగమున నుదహరింప బడిన "ఏతద్వై దేవా వచ", పితృభ్య ఏతద్యజ్ఞం నిర్ణీయ యజమానః ప్రతనుతే" ఇత్యాది పిండపితృయజ్ఞార్థవాదే యజ్ఞోపస్థితావపి నక్షతిః అను వాక్యముపపన్న మగు చున్నది. కావున బితృ యాగానుష్ఠానముచే యాగాధికార మును బొందక దర్శయాగమనుష్ఠించినచో నట్టి యాగము ఫలప్రదము కానేరదనియు వ్యర్థమగుననియు వ్రాసిన.

శ్రీ ఓ. సీ. కం. శాస్త్రిగారి వ్రాతనిర్ధారమనుటకు సంధి
యము లేదు.

శ్రీ శాస్త్రిగారిచట "తుషామహము భంగి పరిణ
మించుననుటకు సందియము లేదు" అని వ్రాసిరి. శ్రీశాస్త్రి
గారికి పొరబాటు గగనకుసుమాయితము "విశిష్య" వారు
శబ్దశాస్త్రజ్ఞులు. కావున వారు ప్రయోగించిన తుషామహ
మను పదము అమూల్యార్థముగల నిరుక్త పదమనుటకు
సందియము లేదు.

మఱియు పూర్వతంత్రమున 4 యధ్యాయమునందు
"అథాతః క్రత్వర్థపురుషార్థయోర్జిజ్ఞాసా" యని ప్రారంభించి
పిండపితృయజ్ఞము పురుషార్థమగు స్వతంత్రకర్మగాని
క్రత్వర్థమగు పరతంత్రకర్మ గాదని నిర్ణయింపఁబడినది.
సూత్రకారు లిద్దానిని స్వతంత్రమగు నిత్యకర్మనుగ
నిర్ణయించిరి. కావున అట్టి స్వతంత్రకర్మయగు పిండపితృ
యజ్ఞము శ్రుతిచే నవశ్యానుష్ఠేయముగ విధింప బడినందున
నద్దాని నాచరింపనిచో విహితకర్మా ననుష్ఠానదోషము
సంభవించునను టయుచితముగాని దర్శయాగము వ్యర్థ
మగునను టయుచితమును శాస్త్రసమ్మతమును గానేరదు.

మఱియు శ్రీశాస్త్రిగారు తమపత్రికయందలి ౧౧ వ
పేజీలో పితృయాగము దర్శయాగాధికారమునుపపాదించు
నట్టి నిష్క్రయణ రూపమగు యాగమేయనియు నిద్దానికి
దర్శయాగాధికార నిష్క్రయణమె ప్రయోజనముగాని

వేరొండు ప్రయోజనము కానరాదనియు, సిద్ధాని నాచరింపక పోయినచో సిద్ధాని నవశ్యాచరణీయముగ నుపదేశించునట్టి శ్రుతి వ్యర్థమగుననియు నట్టి మహాపరాధమును శ్రుతికి నెత్తిగట్టు బ్రాహ్మణుడుండడనియు. వ్రాసియుండిరి. కావున వీరియాశయము దర్శపితృయాగముల కధికృతాధికార భావమును గల్పించిననే పిండపితృయజ్ఞమును విధించునట్టి శ్రుతిసార్థకమగును గాని వేరొండు మార్గమున గాదని గన్పట్టుచున్నది. అయ్యది యసంభవము. నిత్యమగు స్వతంత్ర కర్మనుగా విధించినచో శ్రుతిసార్థక్యమును జెందుననుటకు సందియము లేదు. కావున శ్రీ శాస్త్రిగారు శిష్టానుష్ఠితములయిన దర్శయాగములకు వైయర్థ్యమును గల్పించుటకు నీరెండు యాగములకు నీసంబంధమొప్పుచుంటిరిగాని పితృయాగమును విధించునట్టి శ్రుతికి గతిని గల్పించుటకు గాదని స్పష్టమగుచున్నది.

పోనిండు "తుష్యతు" న్యాయముచే వారియిష్టానుసారమంగీకరింతము. అప్పుడు "పౌర్ణమాసీమేవ యజేత భ్రాతృవ్యవాన్ నామావాస్యాం హత్వా భ్రాతృవ్యమమావాస్యా యాయజేత " పిండపితృయజ్ఞేనైవ అమావాస్యాయాం ప్రీణాతి" అనుశ్రుతియు "పౌర్ణమాసీమేవ యజేత భ్రాతృవ్యవాన్ నామావాస్యామ్" "పితృయజ్ఞమేవామావాస్యాయాం కురుతే" యను నాపస్తంబ సూత్రములును నొకానొకనికి దర్శయాగమును నిషేధించి యూ

యమావాస్యయందుఁ బిండ పితృయాగ మనుష్ఠింపుమని విధించుచుండగా పితృయాగము దర్శయాగ నిష్క్రయణార్థమే యయినచో నిరుక్తశ్రుతి గోచరుడగు నధికారికి దర్శయాగమే లేదుగావున దన్నిష్క్రయణమే ప్రయోజనముగా గలిగిన యీపితృయాగముగూడ ననుష్ఠింపవలదని శ్రీ శాస్త్రిగారు శ్రుతి సూత్రములకు వ్యతిరేకముగ నుపదేశించినట్లు గదా? శ్రుతికి మహాపరాధమును దొలగింపఁ బ్రవర్తించిన శ్రీ ఓ.వీ. కం. శాస్త్రిగారు దర్శయాగానుష్ఠానము లేని యమావాస్యయందుగూడఁ బిండపితృయజ్ఞమును విధించిన శ్రుతిసూత్రములకుఁ బిండపితృయజ్ఞమనుష్ఠింపవలదను మహాపరాధమొనర్చిరేల. శ్రుతికి మహాపరాధ మొనర్చునట్టి బ్రాహ్మణు డుండడని శ్రుతి యాశయమనిరి. శ్రుతిసూత్రములు విధించిన పిండపితృయాగము ననుష్ఠింప నక్కఱ లేనట్టి సంబంధమును గూర్చుట శ్రుతికి మహాపరాధముకాదా?. వీరు బ్రాహ్మణులుకారా?

పిండపితృయజ్ఞమును నిత్యమగు స్వతంత్ర కర్మనుగా శ్రుతిసూత్రములు విధించుచున్నవను సిద్ధాంతము యథావస్థితమగుచుండగా నేదియో యొక భావమును మదినిడుకొని కర్మలకుఁ గ్లిష్టసంబంధముల గల్పించి యొరులు శ్రుతికి మహాపరాధ మొనర్చువారని సాకూతముగ నిందించుచు దుదకు దామేయట్టి మహాపరాధమొనర్చుట యెంతయవమానకరము!

మఱియు శ్రీ శాస్త్రిగారు ప్రమాణముగఁ జూపిన యాపస్తంబ శ్రౌతసూత్ర గ్రంథమెుకింత దిలకింతము. ఆపస్తంబమహర్షి తన సూత్ర గ్రంథముచేఁ బిండపితృ యాగానుష్ఠాన పద్ధతిని బోధించెనను విషయము సమ్మతమేగాని యాపస్తంబుని సూత్రగ్రంథము దర్శపితృయాగముల కధికృతాధికార భావమును బోధించుచున్నదను విషయము మాత్రమాపాతరమణీయము. ఏలయన నాపస్తంబుడు. దమ సూత్రగ్రంథమునందు "అథాతో దర్శపూర్ణమాసౌ వ్యాఖ్యాస్యామః" అను సూత్రము మెుదలుకొని "అలంకుర్వాతే యజమానః పత్నీచ" నవేనాన్వాయ్యకుం. భ్యాయాచ్ఛకర గోమయేన అను లిప్తేభవతః" అను సూత్రము వఱకు నారు కండికలచే, దర్శయాగ ప్రారంభరూపమగు సన్వాధాన దినముయొక్క పూర్వాహ్ణమున నాచరింపవలసిన యన్వాధాన, వత్సాపాకరణ, ఇధ్మాబర్హిస్సంపాదన, ఆయతనాలంకరణాది విధులను జెప్పి ఆనాటి యపరాహ్ణము పితృయాగమునకుపయుక్త కాలము గావున, నా యపరాహ్ణమున నాచరింపదగిన పిండపితృ యజ్ఞవిధిని తృతీయ పటలమున॥ "యదహశ్చంద్రమసం...అపరాహ్ణే" అనుసూత్రము మెుదలు "తత్రగార్హపత్య శబ్దోలుప్యతే సంస్కార ప్రతిషేధాత్" అనుసూత్రము వఱకు నాలుగు కండికలచే నాహితాగ్న్యనాహితాగ్నులకుఁ బిండపితృయాగ విధిని జెప్పి, పిదప చతుర్థపటలమునందలి "అమావాస్యాయాంరాత్ర్యాం స్వయంయజమానో యావాగ్న్యా అగ్ని

హోత్రం జుహోతి॥ అగ్నిహోత్రోచ్ఛేషణమాతంచ నాధ్యంనిదధాతి" అను సూత్రములు మొదలు "సంతిష్ఠతే దర్శపూర్ణమాసౌ" అను మూడవప్రశ్నయందలి నాల్గవ పటలముయొక్క పదునాల్గవ కండికయందలి యిరువది సూత్రముల కు దర్శపూర్ణమాసయాగములయొక్క విధిని విస్తృతముగ నుపదేశించెను. ఇంతియగాని యీ రెండు యాగములకును నధికృతాధికారభావమును సూత్రతః ఆప స్తంబు డెచ్చటను నుపదేశించి యుండలేదు.

మఱియు రుద్రదత్తుడు తృతీయ పటలమునందలి పితృయజ్ఞ విధాయకమగు మొదటి సూత్రమునఁ దన వ్యాఖ్యానమునందు పితృయజ్ఞమును నీదర్శయాగప్రకరణ మున నిరూపించుటకు కారణమును శంకించుకొని = "తన్మ ధ్యోపదేశస్తు పక్షేతత్కాలమధ్యపాతాత్" అను వాక్య ముచే రెండు రోజు లనుష్ఠింపదగిన దర్శయాగముయొక్క మధ్యకాలమునందు నీ పిండపితృయాగముయొక్క కాల మొకానొక పక్షమున సంప్రాప్తమగుటచే దర్శయాగాను ష్ఠానవిధి నిరూపణ ప్రకరణముయొక్క మధ్య నీ పితృయాగ ముపదేశింపబడినదని ఘంటాపథముగా జెప్పిరి.

ఇట్టి తఱి శ్రీ శాస్త్రిగారు దర్శయాగము దివసద్వయ సాధ్యము గాదనియు, సంకల్పమాత్రము యాగారంభము గాదనియు సిద్ధాంతపరచుట్లగాని యీ రెండు యాగముల కధికృతాధికార భావమును నిర్ణయించుటగాని, యీ

రెండును శ్రీ శాస్త్రిగారికి దర్శయాగముల వ్యర్థపుచ్చుటకుఁ దామవలంబించిన సహజసాహసజన్యమగు నుచ్ఛాస్త్రప్రవృత్తియేగాని వేరొండుగాదు.

రామాండారునివలె నీ రుద్రదత్తునిగూడ శ్రీ శాస్త్రిగారు ప్రమాణ భూతుడన్నచో ననవచ్చు. అయ్యది శ్రీ శాస్త్రిగారి కనవస్థరతాభ్యస్తము నత్యంతసులభము నయి యున్నది.

మఱియు శ్రీ. శాస్త్రిగారు పిండపితృయజ్ఞ విధాయకమగు మఱియొక శ్రుతి. దర్శపూర్ణమాస బ్రాహ్మణమగు సంహితయందలి రెండవకాండముయొక్క నైదవ ప్రశ్నయందుగూడ వినవచ్చుచున్నదనియు నద్దానియందు గూడ విధాయక వాక్యము పిండపితృయజ్ఞావశ్యాచరణీయతా దార్ఢ్యమునకై యభ్యాసము గావింపబడినదనియుఁ గావున దర్శపూర్ణమాసయాజికి నధికార నిష్క్రయణముగ నీపితృయజ్ఞ మవశ్యకర్తవ్యమని శ్రుత్యభిప్రాయమనియు వ్రాసిరి. ఇయ్యది యెంత సమంజసమో చూడుడు.

దర్శపూర్ణమాస బ్రాహ్మణమగు సంహిత యందలి శ్రుతియిట్లున్నది. “ఇంద్రో వృత్రగ్ంహత్వా। పరాం పరావత మగచ్ఛదపారాధమితిమన్యమానః। తందేవతాః ప్రైషమైచ్ఛన్। సోఽబ్రవీత్ప్రజాపతిర్యః ప్రథమోఽను విందతి. తస్యప్రథమంభాగధేయమితి। తంపి తరోఽన్వ విందన్। తస్మాత్పితృభ్యఃపూర్వేద్యుఃక్రియతే॥ అని

ఇంద్రుడు వృత్రాసురునిఁజంపి. యసురులకు మహా పరాధమొనర్చి తిమసుభీతిచే కడుదవ్వునకేగి దాగియుండెను. అట్టి యింద్రుని దేవతలు వెదకఁదలచిరి. అపుడు ప్రజాపతి మీలో నెవరు మొదట కనుగొనియెదరో వారికి మొదటి భాగమని నుడివెను. పితృదేవతలా యింద్రుని మొదట కనుగొనిరి. అందువలనఁ బితృదేవతలకొఱకుఁ బూర్వదినమున (అమావాస్యరోజున) పిండపితృయజ్ఞమును జేయుదు. అని దీని యర్థము.

ఇందు దర్శపూర్ణమాసయాగముల ప్రసంగము గాని దర్శాదియాగములను బితరు లపహరించుట, తిరిగి దేవతలు వానినిగోరుట, పితరులుత్రోచమపేక్షించుట, దేవత లందు కంగీకరించుట, మున్నగు కథాప్రసంగముగాని, పితృ యాగమును మూల్యముచే గొనుగొనియేదర్శయాగమును ప్తింపవలయునను నిర్వ్యయణ ప్రసంగముగాని యెంతమాత్రము లేదు. పితృదేవతలకొఱకుఁ బూర్వదినమునఁ బిండ పితృయజ్ఞమాచరింపుమని మాత్ర మభ్యాసము గావింపఁ బడినది.

మొదటి కాండమునందలి శ్రుతియు నీ వాక్యముచేఁ బిండపితృ యజ్ఞమును మాత్రమే విధించియున్నది. శ్రీశాస్త్రి గారుగూడ నీ వాక్యము పిండపితృయజ్ఞ విధాయకమేయని యచట నంగీకరించియున్నారు. రెండవకాండమునందలి యీ శ్రుతియు పూర్వానువాకగత వాక్యసదృశమగు

"తస్మాత్పితృభ్యః పూర్వేద్యుః క్రియతే" యనువాక్యముచేఁ బిండపితృయజ్ఞమును మాత్రము విధించుచున్నదిగాని దర్శయాగనిష్క్రయణమును బోధించుటలేదు.

శ్రుతియే యంశము నభ్యాసమొనరించినదో యా యంశమే శ్రుతితాత్పర్య విషయమనియు నవశిష్టాంశ మార్థవాదికమనియు దప్పక సంగీకరింపవలయును. కావున శ్రుతి పిండపితృయాగావశ్యాచరణీయతను స్పష్టపఱచినది గాని దర్శయాగనిష్క్రయణమును దృఢపఱచలేదు. అద్దానిని దృఢపఱచుటకుపష్టంభకమగు కథాభాగమునుగూడ సూచించియుండలేదు.

కావున శ్రీ ఓ. సీ. కం. శాస్త్రిగారొప్పిన దర్శయాగనిష్క్రయణము పూర్వశ్రుతియందుగూడ నార్థవాదికమేనవియు, విధిసిద్ధముగాదనియుఁ బిండపితృయాగకర్తవ్యత మాత్రమే రెండు శ్రుతులయందును విధిసిద్ధమనియు గావునఁ బితృయాగమనుష్ఠింపనందున పద్దానిననుష్ఠింపని దోషమేగాని దర్శయాగానుష్ఠానము వ్యర్థముగాదనియును, సర్వథా నిర్ణయమగుచున్నది. ఇయ్యది శ్రౌతమగు వాస్తవముటకు సందియములేదు.

మఱియు శ్రీ ఓ. సీ. కం. శాస్త్రిగారు "తస్మాత్పితృభ్యః పూర్వేద్యుః క్రియతే" అను శ్రుతియందలి పూర్వేద్యుః" అను పదము వలన పూర్వదినమునసర్థమాను

లభించుననియు అందుపై దేనికి పూర్వదినమను నాకాంక్షగలు
గగా దర్శయాగదినమున కనియని వార్యముగఁ జేప్పవలసి
వచ్చుననియుఁ బిత్రుయాగమున కుపయుక్తమగు పూర్వదిన
మమావాస్యయే గావున నాయాగాహస్సు ప్రతిపత్తిథియే
గాని మఱియొకటి గానేరదనియు, నందువలన యాగపూర్వ
దినమగు నమావాస్యాపరాహ్ణమున బిండపితృయజ్ఞమాచ
రించినచో, మఱునటి దినమున పూర్వాహ్ణమునఁజేయు దర్శ
యాగమున కధికార సంపాదక మగుటలో నెట్టి యభ్యంత
రము లేదనియును వ్రాయుచు శ్రుతియందలి "పూర్వేద్యుః"
అను పదమును బట్టుకొని యూగులాడుచు తమ వాదమును
నిలు బెట్టుకొనుటకొక త్రోవను ద్రొక్కిరి. ఇయ్యది వీరికిఁ
దోలి పత్రికయగు బిండపితృయజ్ఞ మీమాంసా సిద్ధాంతము
నకును నాపస్తంబ సూత్రగ్రంథమునకును విరుద్ధమగు
చున్నది. వీరికి బూర్వపు పత్రికాకారచయితలు దర్శయాగా
నుష్ఠానమున కారంభమధ్యసమాప్తి కాలములు సూత్ర
గ్రంథసిద్ధములనియు నయ్యది సమంత్రకముగ దినద్వయ
సాధ్యమనియు నమావాస్యా పూర్వాహ్ణమున దర్శయాగా
రంభమగు నన్వాధానము సమంత్రకముగ నాచరింపవలయు
ననియు నియ్యది యాపస్తంబ సూత్రసిద్ధమనియును
నిర్ణయించిరి.

ఇపుడు వీరన్వాధానము సంకల్పరూపమే గావున
నయ్యది యాగారంభమే గాదనియు, యాగమేకదినసాధ్యమే

గాని దినసద్వ్యాయసాధ్యవముగాదనియు, కేవలము తమవాద మును బోషించుకొనుటకు లోగడి సిద్ధాంతమును సూత్ర గ్రంథమును ద్వ్రణీకరించి నూతన సిద్ధాంతమును వెలువఱచిరి.

దీనింబట్టిచూడ నాప స్తంబసూత్రమునకు, వ్యతిరేక మయినను పూర్వప్రతికాసిద్ధాంతమునకు భిన్నమయినను, విద్యారణ్యాశయమునకు విరుద్ధమయినను, మీమాంసా న్యాయమునకు దవ్వయినను, శిష్టాచారమునకు అసమ్మత మయినను, శ్రుతిసమన్వయమున కననుకూలమయినను, జేసిన దర్శయాగములను జెఱచుటయే శ్రీ ఓ. సీ. కం. శాస్త్రిగారి ముఖ్యాశయమని తోచుచున్నది.

మఱియు నీశ్రుతియందు "పూర్వేద్యుః" అను పదము మూడు పర్యాయము లుచ్చరింపబడుట తథ్యమే. అందు "పూర్వేద్యుః" అను పదమునకు "అమావాస్య" యను నర్థమును జెప్పుట యావశ్యకమనుటయు నిజమే. అట్లైననే పితృయాగమానాడు విధింప జెల్లును. కావుననే దర్శయాగ మున కన్వాధానరూపము, యాగరూపము అను రెండు రూపములు భిన్న భిన్న కాలములయందున్నను యాగరూప మగు దర్శేష్టిప్రతిపత్తునందే గావున శ్రీవిద్యారణ్యులు దర్శ యాగమునొక్క యన్వాధానరూపమునువదలి, యాగరూప మును మాత్రమే యమావాస్యా శబ్దమువలన గ్రహించి, యమావాస్యాశబ్దమునకుం బ్రతిప త్తని యర్థమును జెప్పుచు "పూర్వేద్యుః". అను పదమునకు 'దర్శదినే' = (అమావాస్య

యందు) అని యర్థమును నిర్ణయించిరి. గాని శ్రీవిద్యారణ్యు లెచ్చటను దమ భాష్యమునందు "పూర్వేద్యుః" అను పదమునకు దర్శయాగానుష్ఠానమునకుఁ బూర్వదినమున నని యర్థమును వ్రాసియుండలేదు.

కావున నమావాస్యాశబ్దము ప్రతిపత్తను నర్థమునం దెట్లు లాక్షణికమో "పూర్వేద్యుః" అను పదముగూడ నట్లే అమావాస్య యను యర్థమునందు లాక్షణికముగాని, యీ రెండు పదములును వాచ్యార్థప్రధానములు గానేరవు.

శ్రీ శాస్త్రిగారు విద్యారణ్యులయొక్క అమావాస్యా శబ్దభాష్యమునే గ్రహింతురుగాని "పూర్వేద్యుః" అను పదమునకు గల విద్యారణ్యభాష్యమును గ్రహింపరు. ఇయ్యది శ్రుతి స్మృతి సంప్రదాయవేత్తల లక్షణము.

శ్రీ విద్యారణ్యుల యాశయమునఁ బితృయాగ మమావాస్యరోజున ననుష్ఠింపుమని బోధించుటగాక, దర్శయాగానుష్ఠానమునకుఁ బూర్వదినమున నని వారి యాశయమయినచో నెచటనయినను దమభాష్యమున "పూర్వేద్యుః" అనుపదమునకు యాగానుష్ఠానమునకుఁ బూర్వదినమున నని వ్రాసియుండెడివారు. అట్లుగాక "దర్శదినే" అనియే భాష్యమును రచియించిరి.

ఆపస్తంబులును దమ సూత్రగ్రంథమునందు "యదహశ్చంద్రమసం నపశ్యంతి తదహః పిండపితృయజ్ఞం కురుతే

ఉపరాహ్ణే" అని "పూర్వేద్యుః" అను శ్రుతిగతపదము నమావాస్యార్థకముగనే నిర్ణయించిరిగాని యాగపూర్వదిన మని యభిప్రాయపడియుండలేదు. ఆపస్తంబులకట్టి యభి ప్రాయమున్నచో దర్శయాగమెప్పుడును ప్రతిపత్తునాఁడే జేయవలసి వచ్చును గావునఁ దత్పూర్వదినము దప్పక యమావాస్యయే యగును. కాన "యదహఃదర్శయాగః తత్పూర్వేఽహ్ని పిండపితృయజ్ఞంకురుతేఽపరాహ్ణే" అని సూత్రమును రచించియుండెడివారు. నట్లురచించియుండలేదు.

కావున నిది యంతయును శ్రీ శాస్త్రిగారు పితృయాగ మునకు దర్శయాగాధికార సంపాదకత్వము నభిప్రాయపడి అందువలన పితృయాగమునకు దర్శయాగ పూర్వదినకృత త్వమును స్థిరపఱచుకొని యయ్యర్థము శ్రుతిగతమగు "పూర్వేద్యుః అను పదమువలన సంపాదించుకొనదలచి, తల్లబ్ధికొఱకన్వాధానము దర్శయాగముయొక్క ప్రారంభ రూపముగాదను సూత్రవిరుద్ధమగు సిద్ధాంతమునకు గడంగిరి. శ్రీ శాస్త్రిగారి కీయవస్థయంతయుఁ జేసిన దర్శయాగములు చెడినవని నిరూపించుటకేగాని వేరొండు నుద్దేశ్యముతోఁగాదని సుస్పష్టమగుచున్నది.

మఱియు "తుష్యతు" న్యాయాధికారులగు శ్రీశాస్త్రి గారన్వాధానము, దర్శయాగారంభమని యంగీకరించి పిండ పితృయజ్ఞము దర్శేష్టిమధ్య పతితమయినను, పూర్వదిన కృతమయినపుడెట్టి యధికారమునిచ్చునో యూహాడు కత్న

మధ్యమున సాచరించినను నట్టి యధికారమునే యిచ్చునని వ్రాసిరి. ఇది యెంత సాహసము. మా వంశీయులగు శిష్టు లెన్నడును పిండపితృయజ్ఞము నాచరించ లేదనియు నందు వలన వారలాచరించిన దర్శయాగముల సధికారకృతములు గానయ్యె విఫలములనియును నిందించిరి. వీరి వంశీయు లగు శిష్టులును దర్శయాగారంభమునకుఁ బూర్వము పిండపితృయజ్ఞము నాచరించి యుద్దానివలన బొందదగిన యధికారము నెన్నడును బొందలేదు గదా ? ఇఁక ముంద దెన్నడునుఁ బొందబోరు కదా ? ఎల్లపుడును వీరు శ్రుతి గతమగు "పూర్వేద్యుః" అను పదముయొక్క సామర్థ్యము నాధారపఱుచుకొని సంతసింప వలసినదే ! ఏమి యీ సామ ర్థ్యము. ఏనాడును నీ పిండపితృయజ్ఞము దర్శయాగారంభ మునకుఁ బూర్వమాచరింపకున్ననుఁ దత్ఫలమును (బూర్వ మాచరించినపుడిచ్చునట్టి ఫలమును) యజమానికొసగు నట! అట్టితటి నిరత సామర్థ్యముగల నీ పిండపితృయజ్ఞ మీ జన్మ మున నొకతూరి యాచరించి యూరకున్నను నధికారము నీయగూడదా ? జన్మాంతరానుష్ఠానముచే గూడ నట్టి సామ ర్థ్యమును వినియోగింప గూడదా ?

"పితృభ్య ఏవ తద్యజ్ఞం నిష్క్రీయ యజమానః ప్రత నుతే" అను శ్రుతిగతమగు ఏవకారమును ల్యాబంతముతో నన్వయించి దర్శయాగనిష్క్రయణమావశ్యకమని చెప్పునట్టి యా శిష్టులు నిష్క్రయణమునకుఁ బూర్వము దర్శయాగా

రంభము నెట్లు చెప్పిరో దెలియకున్నది. వీరికి పద సమ న్వయము వాదమునకేగాని యాచరణకుఁ గాదు కాబోలు !

శ్రుతిసమన్వయమున కెంత శ్రమపడినను దర్శయాగా రంభమునకుఁ బూర్వము పిండపితృయజ్ఞము నాచరించుట యసంభవము. కావున క్త్వాప్రత్యయము పూర్వకాలీనత్వా ర్థకము గానేరదు. గనుకనే "నేత్రేనిమీల్యహసతి" ఇత్యాది లౌకిక ప్రయోగసామ్య మవశ్య మంగీకరింప వలయును.

మఱియు శ్రుతియందు "పూర్వేద్యుః" అను పదము మూడుసారు లుచ్చరింపబడిన దనియు, నందువలన పితృ యాగము పూర్వదినముననే యాచరింపవలయు ననియు, నీ 'పూర్వేద్యుః' అను పదాభ్యాసము యాగపద్యవాదమునకుఁ గంఠపాశమగుచున్నదనియును శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి.

ఇందుకు సమాధాన మింతకుమున్నొకతూరి యిచ్చి యున్నను స్పష్టప్రతిపత్తికొఱకు మరల వ్రాయుచుంటిని. పిండ పితృయజ్ఞమొకప్పుడు దర్శయాగాంతమున నాచరణీయమగు నని పూర్ణాంగీకారముగను నొకతూరి దర్శయాగ మధ్యపతిత మగునని యర్ధాంగీకారముగను నంగీకరించిన శ్రీ శాస్త్రి గారికి పూర్వకాలీనత్వార్థకమగు పూర్వేద్యుః అను పదము వాస్తవముగఁ గంఠపాశమే యగును. వారాపాశమును వదల్చుకొన దలచినచో పూర్వేద్యుః అను పదమునకు శ్రీ విద్యారణ్యమునీంద్రులు వ్రాసినట్లు దర్శదిన అమావాస్య

యుంచు, అను నర్థము నంగీకరించి యాగపద్యవాదమునుస రింపవలయును.

మఱియు శ్రీశాస్త్రిగారు, "ఏనాడు జ్యోతిశ్శాస్త్రోదిత కాలవశమున నీ పితృయాగమాచరింప వలనుపడదో యా నాడమావాస్యతిథి పరదినమగుటచే నగతికముగ మఱుసటి దినముననే యీ పిండపితృయజ్ఞమును జేయుట సంభవించును. ఒక వేళ నా సమయమున నీ యాగమాచరింప నెవ్వరేని సంకోచించినచో నట్టివారు సప్తహోత్రకా ప్రాయశ్చిత్తమును జేసికొందురు" అని వ్రాసిరి. ఇచట శ్రీ శాస్త్రిగారు నిరూపించిన సప్తహోత్రకాప్రాయశ్చిత్తము పితృయాగలోపమునకా? దర్శయాగవైగుణ్యమునకా? లేక వాదమునకా? యనునది విచారింపవలయును. అందు మొదటి పక్షమంగీకరించినచో పితృయాగమున కానాటి యపరాహ్ణముఁగూడ యుక్తకాలమే. కావున పితృయాగమునే యాచరింపవచ్చును. అద్దానిని మానఁబని లేదు. దర్శయాగలోపమునకన్నచో దర్శయాగానుష్ఠానానన్తరముఁ జేయు నీ సప్తహోత్రకా ప్రాయశ్చిత్తమువలన పితృయాగానాచరణ ప్రయుక్తదోషము హరించునుగాని యనధికారికృతమగు దర్శయాగమున కుపకారముండదు. ప్రత్యుత ప్రాయశ్చిత్తమంగీకరించినచో నీ పితృయాగము పురుషార్థమగును గాని క్రత్వర్థముగానేరదు. కావున పితృయాగము క్రత్వర్థమని వాదమునకు గడంగిన శ్రీశాస్త్రిగారు నిరూపిం

చిన్నప్రాయశ్చిత్తము కేవలము వాదమున కనిస్పష్టమగు చున్నది.

మఱియు నేను శిష్టాచారము ననుసరించి పిండపితృయజ్ఞ మాచరింపఁ బనిలేదని వాచ్యార్థతిచేఁ దెల్పుచుంటి ననియు, మా వంశస్థులగు నా పితామహులెట్టి నిత్యకర్మల నాచరింపకపోయినను దప్పులేదని సాకూతముగ బోధించు చుంటి ననియు, మా వారి పితృయాగా నాచరణము నేటు లైన సమర్థింపఁ బూనితిననియు, నా పత్రికయందలి తొలి వాక్యముచేతనే మా వంశమునందలి శిష్టుల సదాచారమును నేను ప్రకటించుచుంటిననియు, నా మాటలనుబట్టియే శ్రుతి విహితములగు కర్మలను మా శిష్టులేనాడునుగూడఁ జేయకుండ మానివేయుచున్నట్లు స్పష్టమగుచున్నదనియు, ఇట్టి మా వంశీయులే శిష్టులయినచో, వారి వంశీయు లశిష్టులు గావలసివచ్చు ననియు, నా వాదమునందలి సారము నా పత్రికయందలి తొలివాక్యముచేతనే శాస్త్రిగారికి దెలిసినను, నేను నా వాదమునందు జూపిన మార్గము లెంతవఱకు సమంజసములో విచారింప నవసరము శ్రీ శాస్త్రిగారికి గలిగిన దనియు, నందువలన స్థాలీపులాకన్యాయముచే నా వాదము నందలి ప్రధానహేతువులయొక్క సాధుత్వాసాధుత్వములు విమర్శింపఁబడుచున్నవనియు, శ్రీ శాస్త్రిగారు తమ పిండపితృయజ్ఞసమీక్ష యను పత్రికయందు 18, 19 పేజీలలో నుచ్ఛ టించుట నుదహరించియుండిరి. ఇందుకు సమాధానమింతకు

మున్నొకతూరి యిచ్చియున్నను ప్రసంగవశమున మరల వ్రాయుచున్నాను.

ఈ కథకంతకును నా పత్రికయందలి తొలివాక్యము కదా యాధారమని శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. ఆ వాక్యము యొక్క పూర్వాపర సందర్భమును వ్రాయుచుంటిని గావున నద్దానిని నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించి శ్రీ శాస్త్రిగారి విమర్శనాపద్ధతియందలి సాధుత్వమును నిర్ణయింప గోరెద.

నా పత్రికయందలి రెండవపేరా "బహూనాః కాలా దారభ్య శ్రుతివిహిత కర్మానుష్ఠాతృభిరస్మదీయై రనుచానై శ్శిష్టైరయంనానుష్ఠీయత ఇతివినాచత దనుష్ఠానం దర్శయాగా ష్ఠానస్యావైయర్థ్యమ వ్యాహతమితిచ ప్రథాయాః ప్రవృత్తత్వా దత్ర్యావసరోఽస్య విచారస్య కిమయం పిండ పితృ యజ్ఞః దర్శాంగత్వేన అవశ్యానుష్ఠేయః, ఆహోస్విదధికృతాధికారతయా, అథవా నిత్యత్వేన తత్రనాద్యః" అని యున్నది.

ఈ వాక్యములను ఋజుబుద్ధితో సమన్వయము జేసికొనిన ప్రతి మానవునకును ప్రాచీనులగు శిష్టులచేఁ జాల కాలమునుండి పిండపితృయజ్ఞ మాచరింపఁబడుటలేదనియు, అందువలన వారలాచరించు దర్శయాగములు వ్యర్థము లనియును నేకానేక ప్రతీతి నా పత్రికకుఁ బూర్వము బయలు వెడలినందున నీ విచారమున కవసరము కలిగిన దను నర్థము లభించుచుండగా శ్రుతి స్మృతి సంప్రదాయవేత్తలగు శ్రీ

శాస్త్రిగారికి మా వంశీయులగు శిష్టులెన్నడును నిత్యకర్మల నాచరింపక మానివేయుచున్నారని నేను బ్రకటించుచుంటి నను నపార్థమెట్లు లభించెనో తెలియకున్నది.

వీరలు లోకసంగ్రహముకొఱకు బ్రాహ్మణలోకము యొక్క శ్రేయస్సును గోరి నిర్ణయించిన శ్రుతి స్మృతి సంప్ర దాయములుగూడ నిట్టి యపార్థభూయిష్ఠములనుటకు సంది యము లేదు. ఇట్టివీర లుభయ వాదములయందలి సాధుత్వా సాధుత్వములను నిర్ణయించునట్టి సాధువులమని వ్రాసికొనుట యెంత సాహసము ?

మఱియు దర్శపూర్ణమాస యాగములు ప్రధాన ములు, గౌణములు అని రెండువిధములనియు, దర్శపూర్ణ మాసీ కాలములయందు జేయు నీ యాగములు ప్రధానము లనియు, తదితర కాలములయం దాచరించు నీ యాగములు గౌణములనియు, ప్రధానములగు దర్శయాగములకే పిండ పితృయజ్ఞ మంగముగాని తదితరకాలములయం దాచరించు గౌణయాగముల కియ్యది యంగము కానేరదనియు, నందు వలన సత్రయాగప్రకరణమున ననుదినము నీ పిండపితృయజ్ఞ మాచరింపకుండుట సంభవ మనియు, నంతమాత్రమున నియ్యది దర్శేష్టికంగముగాదని చెప్పుట హేత్వాభాసమనియు శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి.

ఇది యంతయు శ్రీశాస్త్రిగారిచే స్వకపోల కల్పిత మగు గాథగాని శాస్త్రసమ్మత మెంతమాత్రముగాదు. ఏల

యన దర్శపౌర్ణమాసీకాలీనములగు దర్శపూర్ణమాస యాగములు నిత్యములును బ్రకృతులును నయియున్నవి. సత్రరూపములగు నీ యవివికృతులును కేవల కామ్యములును నయి యున్నవి. ఇట్టి తటి ప్రకృతులగు దర్శయాగములకుఁ బిండపితృయజ్ఞ మంగమయినచో నతి దేశప్రమాణమువలన సత్రరూపములయిన వికృతులయందుగూడ యావదంగ కలాప మవశ్యము. సంప్రాప్తమగును. కేవల కామ్యములగు వికృతియాగములందు యావదంగ కలాపమనుష్ఠించి తీరవలయును. కావున కౌండపాయుల సత్రయాగములందుగూడ ననుదినము పిండపితృ యజ్ఞమవశ్య మాచరించి తీరవలయును.

ఇఁక నిత్యములగు దర్శయాగములందే శక్తిలేనిచో యావదంగ కలాపానుష్ఠానావశ్యకత లేదని శాస్త్ర మొప్పినది. గాని కేవల కామ్యకర్మలయందు కృత్స్నాంగ కర్మానుష్ఠానావశ్యకత యెచ్చటను ప్రతిపాదింపఁబడియుండ లేదు. కామ్యకర్మలు ఫలకామనలేక ప్రారంభింపకుండ నున్నంత వఱకే యప్రధానములుగాని ప్రారంభించినపిదప నిత్యకర్మల కంటె నెక్కుడు ప్రధానములు ఇయ్యది శాస్త్రతత్త్వము.

ఇట్టి స్థితిలో శ్రీ శాస్త్రిగారు కౌండపాయుల సత్రయాగము లప్రధానములనియు, నందువలన దర్శకు పిండపితృయజ్ఞమంగమయినను నప్రధానములగు సత్రయాగములందు నీ పిండపితృయజ్ఞమంగముగా బ్రవర్తింపనేరదనియు, నంత

మాత్రమున నీ పిండపితృయజ్ఞముదర్శ ప్రయోగముల కంగము గాదనుట హేత్వాభాసమనియును దేని నాధారపఱచుకొని వ్రాసిరో తెలియదు.

పోనిండు శ్రీశాస్త్రిగారి యిష్టానుసారమంగీకరింతము. అయినను గౌణకర్మలయందంగకర్మలవేటిని యనుష్ఠింపబని లేదా? లేక కొన్నింటినేనా? రెండవపక్షమున విశేష విధియు పలబ్ధముగాని పో పిండపితృయజ్ఞమును నంగకర్మను మాత్రమే సత్రయాగములందు మానుటకు కారణమేమి? అట్టి విశేష విధియుపలబ్ధమన్నచో నద్దాని నించుకేనియు శ్రీ శాస్త్రిగారుదహరించి యుండలేదు.

కావున శ్రీ శాస్త్రిగారు జేసిన హేత్వాభాసతా నిరూపణ మాభాసరూపమైనందున హేతుత్వము స్థిరమగుచున్నది.

మఱియు శ్రీ శాస్త్రిగారు జేసిన ప్రధాన హేతుఖండన మెంత యుచితముగా నున్నదో యప్రధానములని వారనిన హేతువులనుగూడ శ్రీ శాస్త్రిగారు ఖండించు టంత యుచిత ముగనే యుండును. గావున నేను నా పత్రికయందు జూపిన దర్శాసంగత్వ హేతువులన్నియు సద్ధేతువులే యని శ్రీ శాస్త్రి గారి ప్రధాన హేతుఖండనమార్గమే తెలుపుచున్నది.

పోనిండు. పిండపితృయజ్ఞమునకు దర్శయాగ నిష్క్రి యణమే ప్రయోజనము. కాని వేరొండు ప్రయోజనము గానరాదని వాదించు. వీరలెన్నడయినను. శ్రుతిస్మృతిసిద్ధమాగు

దర్శయాగారంభమునకుఁ బూర్వమీ పిండపితృయజ్ఞము నాచరించు చున్నారా? లేక దర్శయాగమధ్యమునగాని, దర్శయాగాంతమునగాని పితృయాగము నాచరించుచూ శ్రుతిగతమగు "పూర్వేద్యుః" అను పదసామర్థ్యమువలన యాగాధికారము లభించినదని సర్వదా సంతసించుచున్నారా?

తఱచుగ నీ పిండపితృయజ్ఞము సత్సరమునకు నాలుగైదు పర్యాయములు జ్యోతిశ్శాస్త్రసిద్ధకాలవశముచే దర్శయాగాంతమునఁ జేయవలసి వచ్చుచున్నది. అట్టితఱి వీరీ నాల్గయిదు పర్యాయములు ననధికారకృతము లయినందున నీ దర్శయాగములను భస్మాహుతిప్రాయములొనర్చి, ప్రాయశ్చిత్తముచేతనే స్వర్గమును సాధింపబూనిరని జెప్పవలయును. కావున ప్రాయశ్చిత్తముచేతనే యెంతటి ఫలమునయినను సాధింప సమర్థులగు వీరికి నిత్యకర్మలేల? కామ్యకర్మము లేల? సర్వము ప్రాయశ్చిత్తసాధ్యమే!

మఱియు శ్రీ శాస్త్రిగారు దర్శపితృయాగములయొక్క సంబంధమునకు యజ్ఞోపవీతధారణ సంధ్యోపాసనా స్వాధ్యాయములకుఁ గల సంబంధమును సాటిబెట్టిరి. పితృయాగము దర్శయాగమధ్యను దర్శయాగాంతమున నెట్లు సంభవించునో, యట్లే యజ్ఞోపవీతధారణ సంధ్యోపాసనాదికము గూడ స్వాధ్యాయాంతమునగాని, స్వాధ్యాయాధ్యయనమధ్యనుగాని కర్తవ్యముగా సంప్రాప్తమగుచో—శ్రీ శాస్త్రిగారు సంతసించినను, దుఃఖించినను వాటికిగూడ నంగాంగిభావముగాని,

యధికృతాధికారభావముగాని లేదని ఘంటాపథముగ జెప్పెడి వారమే. కాని యట్లులేదు. యజ్ఞోపవీతధారణ స్వాధ్యాయములకు నియతక్రమము "తస్మాద్యజ్ఞోపవీత్యేవాధీయీతయాజయేద్యజేత వాయజ్ఞస్యప్రసృత్యై" అని తైత్తిరీయారణ్యకమునందు విధిసిద్ధమయి యున్నది. కావున నీ సామ్యమువలన శ్రీ శాస్త్రిగారి కభీష్టసిద్ధి యసంభవము.

కావున నధికృతాధికారభావమునకు లక్షణ మేమి? తల్లక్షణమునకు లక్ష్యమగు నిరుపస్థల మేది? ఆ లక్షణ మిచట సమన్వయించు టెట్లు? కర్మతత్త్వమును మథింప బ్రవర్తించిన పూర్వతంత్రమెందులకుఁ బ్రమాణము గాదు? ఈ ప్రశ్నలకు నిజమయిన సమాధానమిచ్చినచో శ్రీ శాస్త్రి గారి వాదము పితృయాగాచరణ ప్రచారమునకుఁ బ్రవృత్తము ఖనది, అనుష్ఠితములయిన దర్శపూర్ణమాసయాగముల వైయర్థ్యమును సాధింపఁ బ్రవృత్తమయినది పండితలోకమునకు సుస్పష్టము కాఁగలదు.

ఇట్టి కర్మలను తామాచరించి ఫలమును పొందలేక పోయినను, ఆచరించినవారలకుగూడ ఫలములేదని చవిలేని వాదములతో సమర్థింపఁ బూనుట యెంత సాహసము?

శ్రుతిస్మృతి సదాచార సంప్రదాయ వేత్తలగు శ్రీ ఓ. సీ. కం. శాస్త్రిగా రిట్టి పనికి బూనుట యుక్తమే. ఇందలి తత్త్వమును గ్రహింప సమర్థులగు శ్రుతిస్మృతి సంప్రదాయ

వేత్తలీమహాకలియందును నేకొలదిమందియైన నుండరా? వారలయినను తత్వమును గ్రహింపరా ?

ఎటులయినను శ్రీ శాస్త్రిగారి పత్రికయందాలోచింప దగిన విశేషములనేకములున్నను గ్రంథవిస్తరభీతిచే బ్రకృతమిద్దానిని ముగించుచుంటిని. శ్రుతిస్మృతి సదాచారబద్ధులగు విద్వదవతంసులిందలి తత్వమును గ్రహింపవేడుచున్నాను.

ఇట్లు,

మల్లావఝుల వెంకట సుబ్బరామశాస్త్రి